# సత్యసంధుఁడు



కొల్లూరు నారాయణరావు,

సర్వధారి మాఘము.



[వెల రు. 1-8-0

ఓమ్

# సత్యసంధుడు

కొల్లూరు నారాయణరావు,

సర్వధారి మాఘము.

# విజ్ఞప్తి.

ఈనవ్యసాహిత్యయుగమున నవలలును ఖండకావ్యములును జనామోదమును విశేషముగ నందుచున్నవి. కొన్ని యాధునికరచనలను చదువునపుడు నాకుగూడ నేదోయొక గ్రంథమును నవీనభావములతో, చందోబద్ధముగ, సూత్రప్రాయముగ పురాణ ఫక్కీననుసరించి వ్రాయవలయునని యూహకలిగెడిది. నేఁటికి శ్రుతపూర్వమగు నీచిన్నకథను ఖండకావ్యముగ రచించితిని.

ఒకనాఁడు నా పద్యములను దయాస్వరూపులును, ఆంధ్రభాషాభిలాషులును, గవర్నమెంటుట్రయినింగుస్కూలు నందలి ప్రధానోపాధ్యాయులును (ప్రస్తుతము జిల్లావిద్యాశాఖాధికారులుగనున్నారు) అగు శ్రీమాధవపెద్ది నాగేశ్వరరావు పంతులుగారికడ నాపద్యములు చదువుట తటస్థించినది. అంత వారు దీనినచ్చొత్తించిన బాగుండునని ప్రోత్సహించుట యెకాక, నిరాతంకముగ కొనసాగుటకు బలవత్తరమగు నాశీర్వాదమును గావించిరి. మహాత్ములదీవనలు వ్యర్థములుకావుగదా! తదాశీర్వాదబలముననే నే నచిరకాలములోన నీ చిన్న కబ్బమును పాఠకమహాశయులకందింపఁజాలితిని. వారివాత్సల్యమున కెంతయుఁ గృతజ్ఞుడ.

నేనుకోరినంత మాత్రమున నాగ్రంథమున కుపోద్ఘాతము వ్రాయించి దయజూపిన శ్రీకొడుకుల జగన్నాథశర్మ

గారికిని, నాగ్రంథమందలి వ్యాకరణాదిదోషములను సరిజేసి నాకన్నివిధముల తోడ్పడిన బ్రహ్మశ్రీ ఆకుండి వేంకటశాస్త్రి గారికిని, బ్రహ్మశ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి గారికిని సవినయముగ నా కృతజ్ఞతాపూర్వక వందనశతక మర్పించు చుంటిని.

గ్రంథమునకు వలయు కాగితపు ఖర్చును భరించిన భీమునిపట్టణ పురపాలక సంఘాధ్యక్షులగు శ్రీ కలిగట్ల సూర్య నారాయణనాయుడు గారికిని, ముద్రణార్థము కొంత ద్రవ్య సహాయముఁజేసిన భీమునిపట్టణ పురపాలక సంఘసభ్యులగు శ్రీ రాయపురెడ్డి అప్పారావుగారికిని కృతజ్ఞుడను. ఈసందర్భ మున నాకు చేదోడుగనున్న నాసహాధ్యాయులగు మేడపాటి సుందరరావుగారు కూడ ప్రశంసనీయులే!

మానవ సామాన్యబుద్ధికృత దోషమువలనను, లేఖక ప్రమాదము వలనను, ముద్రణాస్ఖాలిత్యమువలనను గలిగిన దోషములను మన్నించి సవరణలున్నయెడల సదయ హృదయులై దెలుప పాఠకమహాశయులను సవినయముగా ప్రార్థించుచున్నాను.

కొక్కిరాపల్లి
ఎలమంచిలిదరి
15—3—49

ఇట్లు
బుధజన విధేయుడు
కొల్లూరు నారాయణరావు

# ఉపోద్ఘాతము.

నాచిరకాలమిత్రులగు శ్రీ కొల్లూరు నారాయణరావు గారిచే వ్రాయబడిన "సత్యసంధుఁడు" అను ఖండకావ్యమును సవిమర్శముగఁ జదివినాఁడను. ఈగ్రంథము మనయాంధ్ర వాఙ్మయములో నుత్తమస్థానమలంకరింపగలదని నాయాశ.

శ్రీ కొల్లూరు నారాయణరావుగారు విశాఖపట్టణము జిల్లాలో సర్వసిద్ధితాలూకాయందలి కొక్కిరాపిల్లి యగ్రహారమున సుప్రసిద్ధ బ్రాహ్మణ కుటుంబమున క్రీ॥ శ॥ 1921 సం॥ [illegible]జన్మించిరి. పిమ్మట ఎలమంచిలి బోర్డు ఉన్నతపాఠశాలలో ప్రవేశపరీక్షయందు తీర్ణులై, విజయనగరము మహారాజావారి కళాశాలలో ఇంటర్మీడియట్ (మధ్యమపరీక్ష) వరకు చదివి, పిమ్మట కారణాంతములచే కళాశాలవిద్యను విడచిపెట్టిరి. కొంతకాలము విశాఖజిల్లా విద్యాశాఖా కార్యాలయములో గుమస్తాగా పనిచేసి ప్రస్తుతము భీమునిపట్టణములోనున్న గవర్నమెంటు ట్రయినింగు స్కూలులో సెకెండరీగ్రేడు ఉపాధ్యాయశిక్షణమును పొందుచున్నారు. వీరు కళాశాలలో చదువనారంభించినది మొదలాంధ్రభాషాజ్ఞానమునకై యనేకగ్రంథములను బఠించిరి. అంతకుపూర్వము వీరికాంధ్రభాషాజ్ఞానము స్వల్పముగ నుండెడిది. క్రమముగ స్వయంకృషివలననే యనేక ప్రబంధములను జదివి కవిత్వమును చెప్పుటనేర్చి "సత్యసంధుడు" అను నీఖండకావ్య

మును. "ప్రతాప పరశురాము" అనునొక నవలనుకూడ రచించిరి.

"సత్యసంధుఁడు" అను నీఖండకావ్యమునకు మూలకథ కాంచనపల్లి కనకాంబగారిచే వ్రాయబడిన యొకకథల సంపుటిలోనిది. అందలికథయిది :—

"పదిమంది దొంగలకు నాయకుడుగా నొకఁడుగలఁడు వాఁడొకనాఁడు శృంగేరీపీఠమును హరింపఁదలఁచిదండధరుఁడై స్వాములవారిని సమీపించెను. స్వామి వానికి స్వాగతమిచ్చి యఖండసత్కారము లొనర్పగా చోరనాయకుని మనస్సు తిరిగి నాటినుండి సత్యమునేపలుకునట్లు వాఁడొక ప్రతిన గైకొని సత్యసంధుఁడాయెను. దొంగతనమును మాత్రము మానలేదు.

ఒకరాజాతని పట్టుకొనఁదలచి మారువేషముతో నుండి సత్యసంధు నర్ధరాత్రమునఁ గలిసికొని కోటలోఁ బ్రవేశించెను. సత్యసంధుఁడు ధనాగారమున ప్రవేశించి యొకపెట్టెలోనున్న మూడురత్నములలో రెండింటినిమాత్ర మపహరించి రాజునకొకటియిచ్చి తనదారినిఁబోవఁదొడఁగెను. ఇంతలో రాజాతనిని తనసేవకులచే బంధింపించి మరునాడు విచారణచేసెను. మంత్రి మూడవరత్న మపహరించి మూడు రత్నములను దొంగయే యపహరించెనని యారోపణఁజేయఁగా రాజుయథార్థమును బయటపెట్టి మంత్రి నాపదవినుండి తొలగించి యాస్థానమందు సత్యసంధుని నియమించెను.

పైకథనే నారాయణరావుగారు తమకావ్యమునకు మూలకథగఁ గైకొని యలతియలతిమార్పులను జేయుచు స్వాభావికమైన వర్ణనలతో తేటతెల్లమగు తెనుఁగుపదములతో నొకచక్కని ఖండకావ్యమును రచించిరి. ఇందు 180 పద్యములుగలవు.

ఆంధ్ర వాఙ్మయమున నీయిరువదియవ శతాబ్దమునకు నవ్యయుగమనవచ్చును. పురాణములయందును, ప్రబంధములయందును, వానినియమములందును ప్రజాదరణము సన్నగిల్లెను. గావుననే యట్టి గ్రంథరచనము నేటిశతాబ్దమున బరిమితముగనున్నది. ఈనూతనశకములోనే గద్యకావ్యములు, నవలలు, నాటకములు, ప్రహసనములు, ఖండకావ్యములు ఉద్భవిల్లినవి. అన్యభాషా వాఙ్మయపరిచయమునుబట్టి యాపోకడలు మనవాఙ్మయమునఁ బ్రవేశించినవి. మాటకు ఈసత్యసంఘుఁడను గ్రంథమే ప్రాచీనులచే రచింపఁబడెనా కృతిపతి ప్రశంస — షష్ఠ్యంతములు — అష్టాదశవర్ణనలు కలిగి సుమారు వేయిపద్యములతో నైదాశ్వాసములతోఁగూడిన యొక ప్రబంధముగ తయారయి యుండెడిదనుటలో సందియములేదు. ఇదియే ప్రాచీన నవీనకవితా దృక్పథములలోఁ గల మార్పు.

కవి తాననుభవించిన యావేశపూరితమైన యత్యుత్తమభావమే సామాజికులను కదల్చివేయగల యాభావప్రకటనమే భావకవిత్వమనుట నిశ్చయము. పోతన యాధోరణి

లో భావకవి. రాయప్రోలు—జాషువా—విశ్వనాథ — ఈగతి ననుసరించియే వెళ్ళిరి. క్రమముగ చందోబద్ధము కాకపోయి నను, భావమున్నను లేకున్నను, అసభ్యకరమైన భావమున్న ను భావకవిత్వమేయనుభావము ప్రబలినది. దీనివలన భావ కవిత్వమే యనుభావము ప్రబలినది. దీనివలన భావకవిత్వ మనునది కొన్ని భావకవిత్వ గ్రంథాలలో మృగ్యమయినది. చివరకు "టకటక నడిచింది జట్కా-బండి—చల్ చల్ మనియెను గుఱ్ఱపువాఁడు" అన్నదికూడా భావకవిత్వములోనికి దిగి "భావకవిత్వము — హేయము—చందో విరుద్ధము—భావరహి తము" అను నభిప్రాయము పండితులలోఁ బ్రవేశించినది. తిరిగి ప్రాచీన సంప్రదాయములకు భిన్నముకాక వ్యంగ్యార్థ ప్రధానమ్ము, నవీనపద్ధతుల ననుసరించి కావ్యములు తయా రగుచున్నవి. వీనిలో విశ్వనాధవారి "రామాయణము" మొద లైనసాహిత్యము చేరఁగలదు. సామాజికుల కసహ్యము కల్గించు పరిపాటియయిన యష్టాదశవర్ణనములకు, నతిశయో క్తులకు ననుచితమగుఁదావు ఈసాహిత్యములో లేదనవ చ్చును, ఇదియే నేడుత్తమకవితక్రింద పరిగణింపఁబడుచున్నది.

పైనసూచించిన పద్ధతిననుసరించియే "సత్యసంధుడు" అను కావ్యమందలి కథావస్తువు నడచినదనవచ్చును. ఇందతి శయోక్తులకుఁ దావు లేకున్నను ప్రాచీన సంప్రదాయములు విడువఁబడలేదు. కొన్నికొన్ని ఘట్టములలో నవ్యత గన్పట్టు చున్నది. ఇది "సత్యమే జయము" అను నీతినిఁ బ్రధానముగఁ జెప్పుచున్నను, "స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మోభయా

వహాః" అను ధర్మమునుగూడఁ బ్రబోధించుచున్నది. ఇందలి కవిత్వము ధారాళమై, మృదువైనపదములతో సామాన్యులకుఁగూడ నర్థమగుశైలిలో రచింపఁబడినది.

ఇట్టిగ్రంథములనింకను బెక్కులరచించి మనదేశమునకును, భాషకును, వృద్ధిని జేకూర్తురని చదువరుల పక్షమున గ్రంథకర్తగారిని ప్రార్థించుచున్నాను.

భీమునిపట్టణం,
తే 6—3—'49,

ఇట్లు
బుధజనవిధేయుఁడు,
భాషాప్రవీణ : కొడుకుల జగన్నాథశర్మ,
తెనుఁగుపండితుఁడు.
సెంటుఏన్సుస్కూలు, భీమునిపట్టణము.

# పండితాభిప్రాయములు.

చిరంజీవి కొల్లూరు నారాయణరావుచే రచింపబడిన "సత్యసంధు"డను పద్యకావ్యమునుసాంగముగా వింటిని. అక్కడక్కడ కొన్నిఘట్టములుగూడఁ జదివితిని. ఈతనిరచన హృద్యమై, రసవంతమై యొప్పుచున్నది. శైలి మృదుమధురమై, ఆయాభావముల కనుగుణమై విరాజిల్లుచున్నది. మచ్చునకొకపద్యమిక్కడ నుదహరించెదను.

పలుకులు చల్లనికప్రపుఁ
బలుకులు నిర్మల సుధాద్రవంబున కనువా
కొలకులు తీయనిచక్కెర
గుళికలు తృప్తినిఘటించు కూర్పిరులకైనన్.

ఈకవి చిరుప్రాయముననే యిట్టి కవితాశక్తిని ప్రదర్శింపగలుగుట కడుంగడు ముదావహము. దీనికితోడు ఇతడు వినయశీలుఁడు, సాత్త్వికపథానువర్తి. కనుక, పుష్పమునకు దావియట్లు, ఈతనివిద్యకు వినయము వన్నెతెగా, ఇతడు చిరకాలము భాషాసేవచేసి, ఆంధ్రమాత యనుంగుబిడ్డగా వెలుగొందుటకు శ్రీ పరమేశ్వరుడీ చిరంజీవికి ఆయురారోగ్య భాగ్యముల నొసంగుఁగాతయని యర్థించుచున్నాను.

భీమునిపట్టణం,
తే 6—3—49 దీ.

ఇట్లు సుజనవిధేయుఁడు,
(Sd ) By మాధవవెద్ది నాగేశ్వరరావు,
B.A., B.ED.,
హెడ్మాష్టరు,
గవర్నమెంటు సెకెండరీగ్రేడు ట్రయినింగుస్కూలు
భీమునిపట్టణం.

*Kalaprapurna*

*Sree Vikramadeo Varma,*

*D. Litt.,*

MAHARAJAH OF JEYPORE

*Fort, JEYPORE,*

*(Orissa)*

జయపురము,

ది ౨౦-౪-౪౯.

## ఆశయము

శ్రీ కొల్లూరు నారాయణరావుగారు నిజవిరచితమగు "సత్యసంధుఁడు"ను నాకు నంపించిరి. దాని నక్కడక్కడఁ జదివితిని. దాని యితివృత్తము మీ దేశమునఁ గథితమగు చుండుటవలన దానిని బెక్కేండ్లక్రిందటనే యుత్కలభాష యందు ననువదించి ప్రకటించితిని.

శ్రీ నారాయణరావుగారి ప్రథమ ప్రయత్నమే యైనను దానిపద్దెములు సరళముగా నున్నవి కనుక నప్పొత్తము జనాదరణమును గాంచును.

ఇట్లు,

శ్రీ విక్రమదేవవర్మ.

Extract from Andhraprabha D/ 17-7-49.

సత్యసంధుడు: రచన శ్రీ కొల్లూరు నారాయణరావు. వెల ఒక రూపాయి. ప్రతులకు గ్రంథకర్త పేర కొక్కిరాపల్లి, ఎలమంచిలిపోష్టు, M. S. M. రైల్వే, విశాఖపట్నంజిల్లా అనే చిరునామాకు వ్రాయాలి.

దొంగనాయకుడు డాకడు శృంగేరిస్వాముల ఆదరమహాత్మ్యమున సత్యసంధుడై, తనసత్యనిష్ఠకారణముగా మహామంత్రి పదమందినగాధను శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు కథలసంపుటిలో నొకచోట ప్రచురించారు. శ్రీ నారాయణరావుగారు ఆ కథనే ఈకావ్యము వస్తువుగా గైకొని స్వాభావికమైన వర్ణనములతో జాను తెనుగు ఛందోబద్ధముగ ఈ కావ్యాన్ని సృష్టించారు. ప్రాచీనసాంప్రదాయాలను వదలకుండా కొన్ని కొన్ని తావులలో నవ్యతను ప్రదర్శిస్తూ, సరళనిర్దుష్టములైన 178 సువృత్తాలలో ఈగాధనంతనీ హృదయంగము గావించారు.

ఓమ్

శ్రీ చిరంజీవి కొల్లూరు నారాయణరావుగారొకనాడీ సత్యసంధునిఁ దీసుకవచ్చి తత్స్వరూపమంతయు నాకు వినిపించెను. ఇతనిమార్గము సరళము. నిర్దుష్టము. హృదయంగమము. సర్వజనగ్రాహ్యము.

దాకులఁగొట్టి సజ్జనుల ద్రవ్యముదోచెడివారి, బీదసం
సారులఁగూల చీఁకటిబజారులనుంచినవారి, సర్వసా
ధారణమార్గముల్ విడిచి ద్రవ్యము ప్రోవిడువారి నూత్నసం
స్కారవిశుద్ధమానసులుగా నొనరింప విచిత్రబుద్ధియౌ
చోరుని సృష్టిచేసి పరిశుద్ధ మనోధన భవ్యశిష్య శ్రేం
గేరిమతాధినాయకుని కే్రవకురాఁగొని తెచ్చి తత్కథా
సారముగా ధరాధిపతి సౌమ్యముఁజూపగనెంచి మంత్రిపై
నేరముమోపియుం దదవినీతునిఁ జంపక సత్యసంధుడన్
పేరను ఖండకావ్యము, ననింద్యమృదూక్తుల సేకరించి కొ
ల్లూరుకులుండువ్రాసె నవిలుప్త కళానిపుణత్వ మేర్పడన్.

విజయనగరం, 13—3—49.

ఇట్లు,
(Sd.) ఆకుండి వెంకట శాస్త్రి.

ఓం నమో భగవతే రమణాయ

బ్రహ్మశ్రీ కొల్లూరు నారాయణరావుగారిచే రచియింపఁబడి మనోహరకథా సంవిధానము గల్గియున్న 'సత్యసంధుఁడు' అను ఖండకావ్యమును విని యమందానంద భరితుఁడనైతిని. ఇది మిత-హిత-ప్రసాద-సూక్తి లలితమై పాఠకుల నాకర్షింపఁగలదని తలచుచున్నాను. దీనినిఁగూర్చి నా యభిప్రాయము క్రిందిపద్యమునఁ బొందుపరచుచున్నాను.

మ॥ వినుతార్థ ప్రకరంబుగల్గి రససంవిద్యోగముంగాంచి ధ
ర్మనిరూఢాచరణ ప్రదీప్తిఁగొని, ధైర్యంబూని, సమ్యక్పద
ప్రణయంబుఁ వహించి, సజ్జనమతిన్ రంజించుచున్ సత్యసం
ధుని చందంబున సత్యసంధుడు యశోధుర్యస్థితిన్ వెల్గెడిన్!

విజయనగరము,
2—3—49.

ఇట్లు సజ్జనవిధేయుఁడు,
మహారాజ సంస్కృత కళాశాలాంధ్రపండితుఁడు,
(Sd.) పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.

ఓమ్

# సత్యసంధుఁడు

శ్రీపాదంబుల శ్రీహృదయా
మోదంబుల నమరవర్గ మునిసచ్చిత్తా
హ్లాదంబుల నారాయణ
పాదంబులఁ గొలుతు నాత్మఁ బ్రవిమలభక్తిన్. 1

వరవసంత ప్రశాంత ప్రభాతకాల
మద్ది; బాలభానునియెండ యలమనలరె
కేకికోకిలశారికా కాకలీక
లకల కలిత లలితవన నికటమొకటి. 2

సల్లలిత తద్వనస్థ విశాలఘనర
సాలసాల చారుకుసుమజాల సతత
పతితపీత పరాగాలవాలగాత
మీసలిల బిందువాహియై మెలఁగుగాలి. 3

అట్టి ప్రభాతకాలమున నావనమార్గముబట్టి వచ్చియా
తట్టుననిల్చె నొక్క ద్విజతండము వేడుకమందవాత సం
ఘట్టిత వీరుదగ్రచర కమ్రరవాళి మనోజ్ఞగానము
న్నెట్టెడురీతి మంత్రముల మేలగులీలల నుచ్చరించుచున్. 4

వారిమధ్యనున్న యొకసవారినుండి
తలుపుమెల్లనఁదీసి యీవలకువచ్చె

నుదయగిరి పురోభాగాననుండి వచ్చు
భానుమండలమునుబోలు పరమమూర్తి. 5

అతఁడె శృంగేరి పీఠేశుఁ డనఁగఁబరఁగి
యమల తేజోవిరాజితుఁడగుచునొప్పి
యధికసుజ్ఞాననిధియనాచు నలరుచుండి
తనదుశిష్యజనమ్ముతో ననియెనిటుల. 6

మహిత భూరుహమంజుల మంజరీప
రాగ పుంజపింజరితమై గ్రాలుచుండు
గౌతమీతీర సైకత భూతలంబు
గాంచితిరెమీరు కన్నుల కఱవుదీర.

మధుకరకులపరిదర్శిత మధురగోష్ఠి
కాలకంఠగళోద్భూత కలకలంబు
కోకిలమనోజ్ఞకాకలీ కూజితంబు
కర్ణయుగ్మమునకు విందుగలుగఁజేసె. 8

మందానిల సంఘట్టిత
సుందరలతికాచలనము శోభిలుచుండెన్
విందునకుఁ బిలుచుసజ్జన
సందోహముసేయు హస్తచాలనమనఁగన్. 9

కమనీయస్వరగాన చాతురిని వృక్షశ్రేణికిన్జూపుచు
న్గమలుంగాక పికంబులేమి బహుమానంబిచ్చు నీలోభివృ
క్షములాయాకులుదక్క నవ్యకవితా సౌందర్యముంజూపిన
న్దములంబేకద లోభిసేసెడు మహాదానంబు సచ్ఛ్రేణికిన్. 10.

వేఁడుకదోచుఁ జిత్తమున భిక్షుకునేఁడిటనుంటకంచుఁ దా
నాఁడఁ బ్రకంపితాంగుఁడయి యంతటబల్కెదివాను "దేవరా!
వేఁడెద; నాదువిన్నపము వీనులఁబెట్టుడు భారమెంతయు
న్నేఁగొనఁగూర్చు నందులకు నెమ్మదిమీరలు తాల్మినూనరే"

"స్వామీ! యీవనభూమి తస్కరులకావాసంబనన్వింటి; స
ద్ధేమాలంకృత పీఠికాయుతులమై యెట్లుందుమిచ్చోట నీ
సామీప్యంబగునట్టి భాగ్యపురికిన్ సాగించినన్మేలగున్
నేమారాడితినంచు నెంచకుఁడు మన్నింపందగు న్భృత్యునిన్.

అనవుఁడు స్వామి మందతరహాసముమోమునదోపనిట్లనె
"జననముఁ బొందువేళ నొకసన్ననిగోచియులేదు; కాటికి
జనియెడువేళఁ బూతికయుఁ జంకనుబెట్టఁగలేమ దేటికో
మనదిదియంచు నింత యభిమానముఁజూపఁగ భాగ్యరాశిపై

"దొంగయందురు వాఁడేమి దొంగిలించుఁ
బ్రాప్తిలేనిధనముఁదక్క? ప్రాప్తమున్నఁ
దొలఁగనేరదు తృణమైనఁ దలచిచూడఁ
దానిఋణము దీర నదియె దాటిపోవు. 14

"భర్తయెవ్వఁడు? ధనమేమి? హర్తయెవఁడు?
ఒక్కమూర్తియె యలరారుఁ బెక్కుగతులఁ
దన్నుఁదాను తనకడనె తస్కరింపఁ
దల్లడిలనేల? మదినిటుల్దానికొఱకు. 15

"కాలము ప్రతికూలగతినున్న రక్షక
భటులు బ్రోచుధనమె యెటులొ దొలఁగు

కాలమె యనుకూలఁగలినున్న నెవ్వరో
యిచట మనకు బిచ్చమిడఁగవచ్చు: 16

అని ఘనాఘన గర్జనస్వనముదోఁప”
బలుకు గురునిగురు కరుణావర్షమునకు
మొలకలెత్తెఁ జిత్తక్షేత్రములను ధైర్య
బీజములచటివారికిఁ బెక్కువిధుల. 17

పంచమస్వరమునఁ బాడుపికాంగన!
యాహ్వానమొనరించి యాదరింప
గౌతమీ కంకణ కలిత లలితవాత
మర్ఘ్యపాద్యాదిక్రియల్ఘటింపఁ
బ్రవిమల మంజరీభాసితవృక్షము
ల్ఛత్రచామరముల సంఘటింప
సుమనసి పరిచయమ్ముఁజూపెడు భృంగమ్ము
సరససల్లాపముల్సలుపుచుండ

గారవించెఁ బ్రకృతికాంతవారి నచట
నలరు లర్పించె వల్లికాహస్తములను
కలిమిగలవారికడనైనఁ గలుగనట్టి
బహుళమర్యాద సమకూఱె వారికచట. 18

జొంపంబు కొనయందు సొంపారు పువ్వుదళుల
ముఖవికాసంబొచు ముదముదోఁప
చివురుటాకులజారు చిరుమంచు బిందువు
లానందబాష్పమ్ములగుచు మెఱయ

పిల్లగాలులకూఁగు విటపాళిచలనమ్ము
ముదమునఁ దలనుంచు పోలికనొప్ప
చిన్నిపాటలుపాడు చిరుతేఁటి మ్రోతలు
స్తోత్రపాఠమ్ముల సొంపునూనఁ
బ్రకృతియను గేస్తు సంతోషవార్ధిఁ దేలె
నట్టిజ్ఞానైక సత్పరమతిథియగుట
తత్ప్రమోదంపు మితి నెన్నఁ దలతు రేని
అందు లీనంబుగా వలె నద నెఱింగి. 19

ఆవనమధ్యమందొక మహావటవృక్షము చెంతఁ గ్రూరచో
రావళి గూరుచుండి కడుయాతనగల్గెను రాత్రినిద్రలే
కీవిధిఁ గన్నులెఱ్ఱవడ నేమియుఁ బ్రాప్తము లేకపోయె నీ
తావున పాంథులెవ్వరును దక్కరటంచుఁ దలంచుచుండగన్.

వారలలోన నొక్కరుఁ డవారణదారుణ దర్పమూర్తియా
కారము నెన్నఁ గాలునకాలునరాయఁగఁజాలురీతిఁ జె
న్నారెడువాఁడు వారికధినాథుఁడు ధీరుఁడు సత్యసంధుఁడ
న్పేరుననొప్పువాఁడు కడుబ్రీతిగ నారసి పల్కె నిట్లుగా. 21

"కడచినరాతిరి యెటులనొ
గడచెను వ్యర్థముగఁబోయెఁగానియుఁ జేత
న్బడలేదటంచు మదిలోఁ
దడబడలాభంబదేమి తస్కరులారా. 22

"వింటిరో లేదో శృంగేరి పీఠమచట
విడిసెఁ దులలేని బంగారు వెండినగల

తోఁడ దానినెల్ల మనము దోఁచుకొనఁగఁ
గలవుదీరునింక నితరకాంక్ష లేల." 23

అననొక వృద్ధచోరుఁడు నిజాంగము మేఘముఁబోల నెత్తినా
గనులు మెఱుంగు దీవియలకైవడినొప్ప నిజోక్తిమార్గపుం
ధ్వనులురుముల్జనించిన విధంబునఁజూపగ నోటితుంపర
ల్జినుకులరీతి నచ్చటను జిమ్మెను దుర్దినశంక దోఁపగన్. 24

"ఈముసలిపల్కు- లించుక వినవయ్య
సత్యసంధ ! పనులు సలుపు వేళఁ
గాంచవలయు నరుఁడు కాలమానస్థితు
ల్వానినరయకున్న వచ్చుముప్పు. 25

కాలమాదొంగకనువగు కాళరాత్రి
గాదు;మానమామన సంఖ్యగాదు వారి
దానికన్నఘనము; స్థితిఁదలపవారు
భూసురులుగాననావంకఁబోవఁదగదు 26

అంతటవారలు న్వికటహాసముసేయుచు జూచి వృద్ధుఁడా
యెంతటి ధీరమానసుఁడ వీవహా శాపనవారికైకటా
యింతగఁ గాలమానముల నెన్నుచునుందువె సిగ్గుదోపదే
స్వాంతమునందటంచును దిసంతులుగొట్టుచుపల్కిరిట్టులన్. 27

పిఱికిపందలైన విప్రులె వెన్నాఁడ
భీతిఁజెందెదేల వెఱ్ఱితాత
లేడిగుంపుఁజూచి వాడిబాణముజార
పాఱువేటకాని పగిదినీవు. 28

అనుచుఁ బెక్కుభంగుల నపహాస్యమాడు
వారిసద్దెల్ల నడఁగించి చోరభర్త
సర్వతస్కరాభిప్రాయ సరణి నెఱిఁగి
పలికె నిట్లు వారలు బాగుబాగనంగ. 29

వృద్ధుఁడాడెనంచు వీఁడాడు పలుకుల
వినకయుంట మనకు వెరవుకాదు;
లోతెఱుఁగక నీటిలో మున్గవచ్చునా ?
యెదుటివారిబలము నెఱుఁగవలయు. 30

కానఁ దొలుత నేఁ జనివారి, గాంచివత్తుఁ
బిదప దోపిడిఁ గావించి వెడలవచ్చు
మీరలెల్లరు నిచ్చోట మెలఁగుఁడయ్య
యనుచువారల నటనిల్పి యతఁడు సనియె. 31

అటులవారలకడనుండి యరిగియరిగి
తరులతాగుల్మసంఘంబు దాటిదాటి
శ్రుతినినాదముల్వీనులఁ జొనిపిచొనిపి
చేరె మెల్లన గౌతమీతీరమునకు. 32

దండధరుఁడయి రెండవ దండధరుని
యటుల భీకరగాత్రుఁడై యలరునతనిఁ
గాంచి ఛాందసులెల్లరు కలతఁజెంది
విన్నవించిరి స్వామితో వేగమిట్లు. 33

అనఘా రెండవరుద్రునట్లు గడునుగ్రాకార మొప్పారఁగాఁ
గనులన్నిప్పులుజాఱఁగాఁ జెమటయంగంబెల్ల నిండారఁగా

ఘనమా దేహము ధూళివాలఁగ మహా కాయుండు తా నెవ్వఁడో
మనవంశజ్ఞను దెంచుచుండెఁ దొలఁగ న్మార్గంబు యోజింపవే
వాని రక్తాక్షి యుగ్మంబు వానిభీక
రాననంబుఁ జాటుచునుండె నతనిహృదయ
కర్కశత్వంబు మనకింకఁ గానరాదు
వానికడనుండి దొలగంగ పథము దేవ ! 35

ఇది పీఠంబతిపావనంబని గురుండీతండు పూజ్యుండటం
చెద నూహింపఁడుక్రూరమానసుఁడు దానీక్షించువిత్రార్జనం
బె, దయాలేశము చిత్తకోశమునఁ గాదింతేనియుండదై వమా
కదలన్మార్గము వేఱులేదు మనుటింక న్సంశయంబయ్యెడిన్. 36

అనుచు న్బహువిధంబుల న్వగచు శిష్యవ్రాతసంతాపము
న్వినియొక్కించుక లేతనవ్వు పెదవిన్ గ్రీడింపఁగా వారల
న్గనియా నిశ్చలచిత్తుఁడిట్లనియె లోకంబందుఁ గాసున్నదా
ఘనదుఃఖాగమ శంక నేల దొలుతన్గన్నీరు వెచ్చింపఁగాఁ. 37

ఎన్నడో కష్టములువచ్చు నేమొయంచుఁ
దొలుతఁగన్నీరు కార్చినఁ దొలఁగు నొక్క
జాలినొంది తాబోయెదు సకలదుఃఖ
నమితిమాయలోఁబడి యిట్లు సలుపుచుందు. 38

అనుభవింపక తప్పునె వెనుకజన్మ
లనొసరించిన కర్మఫలంబులెల్ల
మంచిచేసిన ప్రాప్తించు మంచిఫలము
చెడ్డ గేసినఁగల్గును చెడుఫలంబు. 39

హానిదేనికిఁగావించు నతఁడువచ్చి
యాత్మకా? కాదునాశన మటకుఁబోదు
దేహమునకుఁజేయునని సందేహమున్నఁ
దొఱఁగిపాఱేల. వదలనీతోలుసంచి. 40

ఇంక నడుగైనమోపలేదిచట నతఁడు
బెంగయప్పుడె చిత్తముల్గ్రుంగఁజేసె
వాఁడు మనవంకఁ జనుదెంచు పనియదేమొ
తెలియదప్పుడే యీరీతిఁ దెగడనేల 41

అని యిటు మందలించువఱ కచ్చటికిన్జనుదెంచి చోరుడు
గ్గనుఁగవ కెంపులొలుకఁ నటఁగాంచుచుఁబల్కెనదెవ్వఁడో మహా
ఘనుఁడఁట తత్త్వవేత్తయఁట గానఁగవచ్చితి నిప్డువానిదా
ఘనతఁ బరీక్షసేయవలెఁ గావునఁజూపుఁడు వేగనాతనిన్. 42

గురుఁడను నేఁజోరతతికి
గురుఁడాతండనుచు మీరు గొలుతురువానిన్
గురుతింపఁబడు నిపుడు మా
యిరువురియందున గురుత్వ మెవ్వరిదానో. 43

ఆశాంతరాసివినఁగా
నాశాంతక్షోణిధర గుహావళి మ్రోయం
గా శాంతిహీనుఁడిటు వి
త్రాశాంతరిత నిజహృదయుఁడౌచున్బలుకన్. 44

గురుఁడట యొన్నఁగా నితఁడుగూడ నదెవ్వరికైననేమి త
స్కరుఁడనివల్కఁగాఁదగదు సత్వరమీతని సత్కరింపుఁడీ

గురుతరభక్తితో నితఁడు కోరెడువస్తువులెల్ల నిచ్చుచున్
వరసుగుణాఢ్యులారయని వారికి స్వామివచించి పిమ్మటన్. 45

దివ్యమై యలరెడు తనతేజమెల్ల
హర్షచూపులతోడ వియ్యంబులంద
మెల్లమెల్లన జనె గౌతమిదెసకతఁడు
గురునియానతిఁ దలఁదాల్చుకొనుచువారు. 46

ధర్మపీఠమందు వానినాసీనుఁగా
వించి యర్ఘ్యపాద్యవిధుల నెఱపి
యేమివలయునీకు నిచ్చెదమిప్పుడు
దెల్పుమన్న నితఁడు తెల్లవోయె. 47

ఔరా! యెంతటి శాంతమానసులో వీరాశ్చర్యమైదోచెడున్
జేరనాద్రదలకావిరంగు కనులన్ జిత్తంబులన్బాపురే
యారోహింపదు కిన్క యేమియును మర్యాదాయపారంబ నేఁ
గ్రూరాత్ముండ నటంచెఱింగియును నాకున్గౌరవంబేటికో, 48

నుడువరు తడబడు పల్కుల
ముడువరు భ్రూలతికతార ముడియవిడుపునం
చుడుఁగరు సత్కారంబును
విడువరు మొలకనగవులను వీరలుభళిరే. 49

పలుకులు చల్లనికప్రపుఁ
బలుకులు నిర్మల సుధాద్రవంబున కనువౌ
కొలకులుతీయని చకోర
గుళికలు తృప్తినిఘటించు క్రూరులకైనన్. 50

ఘలమా సద్గుణజాలమా కళల సాంగోపాంగవిజ్ఞాన మా
గలుగంజేయును నాకువీరొసఁగు సత్కారంబులన్బొందఁగా
నిలనర్హత్వము పాపరాశినగు నన్నిట్లేల పూజింతురో
తెలిసెన్ జ్ఞానులు సర్వజీవుల నొకేదృష్టి న్విలోకింత్రిహా.

వైసులఁజెండిపోసిన నృపాలుర కోశములందు లేవొ బే
హారములందుఁ దేలికగ నన్యులమోసము జేసి రాసిగా
గూరిచి నింపినట్టి బలుకోమటి మేడలయందు తేవొ యీ
వీరలఁ బూజనీయమగు పీఠమునందు నెగాని విత్తముల్. 52

ఆరయ దొంగమంత్రముల నమ్మిజనాళిని నమ్మఁజేసి వి
స్తారధనంబుగూర్చు ద్విజసంఘము చెంతను లేవొగా దెలం
బెనులఁగోసి నింపు నల పాదజవర్యుల యిండ్లలేవొ యీ
వీరలఁబూజనీయమగు పీఠమునందు నెకాని విత్తముల్. 53

కాలగర్భాన విశ్రాంతిఁ గాంచుచున్న
స్థూలకాయము లెన్నియో నేలయందు
లీనమైన మేడలవెన్నొ లెక్కలేవు
ముటికికుండయా నీపొట్ట పెరుగుచుంట. 54

పెక్కు కత్తుకలనుతిమి పెట్టుచున్న
నిండకున్నది యీపొట్ట మండిపోను
తుదకు మతగురువులసొత్తుతోడ నిండ
వచ్చెనిప్పుడిచ్చోటికీ పాడుకట్టె. 55

ఒక్కరా! యిద్దరా! మరిలెక్కవెట్టఁ
దరముకాదు నాకత్రికి దప్పెఁదీర్ప

వేడినెత్తురు నిచ్చిన విమలమతుల
దానికన్నీటఁగడిగిన దీనజనుల. 56

గుండెకాదిది లోహంపు గుండెకాదు
కాదుమొత్తనౌసద్దియుఁ గాలెనేని
రాయియగు నిద్ది లేక వజ్రంబె యగునొ
కలుగునేమొ యవ్వియుగాని కలుగునెయిది. 57

ఏఁటికొసంగినావు పరమేశ్వర మానవజన్మమీవు నా
కూటికిగుడ్డకుఁజనుల గొంతులునొక్కుచు నీదుదృష్టికిన్
జేటునుగూర్పనా ? యటులజేయుటకింతటి గొప్పజన్మ మిం
కేటికిఁ గ్రూరజంతువుగ నెందొజనింపఁగఁ జేయరాదొకో. 58

అనుచు నాటిదనుక నాచరించిన జీవ
హింసలెల్లఁదనకు స్మృతికిరాగఁ
బనవిపనవి దుఃఖమును బట్టఁజాలక
భోరుమంచువ్రాలె భూమినతఁడు. 59

నష్టధనుఁడైన యొకలోభి నరునిరీతి
వ్యాఘ్రపుంగవ మెదురైన హరిణికరణి
ఘోరదుఃఖ వివశుఁడగు చోరుఁగాంచి
యక్కజంబంది యీరీతి ననిరివారు. 60

"అన్నా! తస్కరనాయకా! యిటులదుఃఖాక్రాంతచిత్తుండవై
కన్నీరేటికి నించుచుండెదవు ? నీకాంక్షన్వడిన్ దెల్పుమా !
పాన్నో, వెండియొ, రత్నభూషణములో ముత్యంబులో,
ధాన్యమో
చెన్నౌవస్త్రములో, ధనంబొ, యితర శ్రీవాంఛ లేమున్నవో

అనుమానించెద వేల ? చోరకులనాథా ! మోసమ్మైదైన మే
మొనరింపంగఁ దలంచుచుంటిమనియా ? యోచింపకారీతిగా
ఘనుఁడౌ మాగురునాన; మేము వెతలన్గల్పింపఁగాఁబోము, నీ
కనులన్బాష్పములుంచఁబోకు; కొనుమా కామ్యార్థముల్వేగ మే

అన్నా ! మామర్యాదల
నున్నతదోషంబు లేవొ యున్నవియేమొ
కన్గొన్నఁ దెలుపుమతిఘుల
న్మన్నించుటకంటె వ్రతము మాకిఁకఁగలదే ? 63

పలుకుల నెపమునవారలు
చిలికెడు నమృతంబుగ్రోలి చేదోయితల
న్నిలుపుచు గద్గదరవమునఁ
బలికెను వారలకుఁ జోరపతి యీరీతిన్. 64

ఎంచకుఁడయ్య మర్త్యుఁడని యీశ్వరుమానవరూపదైత్యుఁడే
యంచు గ్రహింపుఁడయ్య కడునల్పులనల్పుఁడువీఁడుమీరుపూ
జించుట వ్యర్థమయ్యమరి జెప్పఁగ సిగ్గగుమీకునెగ్గుగా
వించుట కేకదా యిటకు వీఁడరుదెంచెను క్రూరబుద్ధియై 65

వలసినదానిఁగోరుమని పావనమానసులార ! యిప్పుడే
పలికితిరీరు మీగురునిపాదములందలి ధూళిలేశమున్
దలను ధరింతు బత్తిమెయి దానినొసంగుడు దానికన్న నే
వెలగల వస్తువున్నయది విశ్వములోపల నెంచిచూడఁగన్

అనుచు నుత్తరసంగ్రహణానురక్తి
లేకయుత్తరక్షణమున లేచి యాతఁ

డుత్తరాభిముఖుఁడయి గుణోత్తరుఁడగు
గురునిచరణసేవనోనర్ప నరిగెఁబ్రీతి, 67

అరిగియరిగి కాంచెను త
స్కరవరుఁడంభోజమిత్రి సన్నిభ తేజున్
గురు రాజు న్మూర్ధఘటిత
కరకమలద్వంద్వుఁడౌచు ఘనతరభక్తిన్. 68

చెడుతలంపప్డుఁ బొడముటఁజేసిసిగ్గు
స్వామికోపించుననుశంకవలనిభయము
సద్గురుఁగనుగొంటిననెడు సంతసంబుఁ
గూడి మానమూతనికిచ్చె కొంతతడవు 69

అట్లువానిమై తనమ్రోల నలరువానిఁ
గాంచియోగీంద్రుఁడిట్లనెఁ గరుణతోడఁ
జేసినారె సత్కారవిశేషములను
తస్కరేశ్వరా! మావారతండ్రులౌచు. 70

ఆదరించి శిష్యులర్పించినారలె
కోరువిత్తమెల్లఁ గూర్మినీకుఁ
దృప్తిఁగాంచినావె? దెల్పుమింకేమైన
మాకడఁగలవస్తు మండలముల. 71

అనవుఁడు యోగిపుంగవు పదాంబుజయుగ్మమునందువ్రాలి సే
త్రినలినపత్రముక్తజలధారలవానిని గడ్డిలేచి యి
ట్లనియెను సత్యసంధుడు మహామధురోక్తుల గాననైతి నేఁ
గనుఁగవ నింతదాక పొరగ్రమ్ముటఁజేసి భవన్మహాత్మ్యమున్.

ఆరుపెద్దడొంకలు నాదు నాత్మభూమిఁ
బెఱుఁగుచుండెఁ గామాదుల న్వైళ్ళతోఁడ
వీనికడనున్న జ్ఞాన మన్బిల్ల మొక్క
నెదుగనిచ్చుట లేదివి యింతదనుక. 73

ఛేదితములాయె నిప్పుడు నీదులలిత
వీక్షణలవిత్రములవల్ల వింతదోపఁ
దుప్పలారును నాశయుఁ దోచుచుండె
నల్ల చిరుమొక్క తావృద్ధి నందునంచు. 74

చతురవాజ్ఞ్నపుణుఁడగాను స్వామినీవు
ప్రీతిఁబెట్టిన సాత్విక భిక్షఁబాగడ
భిక్షకిప్పుడు మాభిక్షఁ బెట్టవలయుఁ
గైకొనరె నాదువినయసత్కారములను. 75

వల్లెయనుపల్కు నీనాల్క వదలెనేని
బాగుఁడఁ దరమౌనె ? నాపూర్వపుణ్యఫలము
ఇయ్యకొనవేని యేరీతి నిన్నినాళ్లు
జేసినట్టి నాపాపముల్బాసిపోవు ? 76

అనియాస్వామిని పెక్కుభంగులిటులాహ్వానింపఁగానాతఁడీ
తనిభావంబుఁ బరీక్ష సేయఁగడు నుత్సాహంబుతో నిట్లనెఁ
జనునీపాపములెల్ల నీకుఁగల పశ్చాత్తాపమున్బట్టియే
విను నీవిత్తము మాకుభిక్షనిడఁగా వెచ్చింపనింకేటికిఁ. 77

ఉద్రేకంబున మాకుభిక్షనిడఁగా నూహింతువేగాని యే
ఛిద్రింబుల్లనమకూరునో మదిని యోచింపందగున్మాకిటుల్

నీద్రవ్యంబును ఖర్చుసేయుటవిన్నవారలేమందురో
భద్రంబయ్యెడు దారినేగుటయె సంభావించెదర్ భిక్షుగా. 78

అని పలు తెఱగులఁ బలికియు
ననివార్యమనోరథుఁడగు నాతస్కరునిన్
గనిగ్రమ్మర యతినాథు
డనియె దయాధీనహృదయుఁడగుచున్ప్రీతిన్. 79

విను నేజెప్పిన నేమము
నొనరుపఁగాఁజాలుదేని యొప్పెదనిపుడేఁ
గొనఁగా నీకడభిక్షను;
జనియెద నీకట్లుసేయఁజాలకయున్నన్. 80

అద్దియేదన నీవట్టి యవసరంబుఁ
గలిగియున్నను సత్యంబె పలుకవలయుఁ
గష్టకాలంబులందైనఁ గల్లలాడఁ
దగదు దీనిననుసరింపఁ దరమె నీకు. 81

గురుఁడీరీతిఁ బలుకనది
చోరకుండవె తనదు చెవుల చోద్యంబొదవన్
సరగున నాయతిపదముల
శిరమున మోపి యతఁడు దృఢచిత్తుండగుచున్. 82

యతికులచంద్ర నీదుచరణాంబుజయుగ్మము నానిచేసెదన్
బ్రతినను నేటినుండియును ప్రాణముపోయెడు హానివచ్చిన
న్గొతుకక, సత్యమాడెదను కోరికసద్గురు, దూలనాడుదు
ర్మతికగునట్టి దుర్గతి తిరంబుగ నాకగుఁ గల్లలాడినన్. 83

భానుమండలంబు పడమటికొండను
బొడిచిన నొక వేళఁ బొడువవచ్చు
కాంతిశశికి పగలు ఘనమైనఁగావచ్చుఁ
గాని పలుకఁబోను కల్ల నేను. 84

అని శపథంబు జేయుతరి నాతనిమాటకు మెచ్చి దేవతల్
ఘనసుమవర్షమున్గురియుకైవడిఁ బూవులు రాలె దుందుభీ
ధ్వనులటుగౌతమీజలరవంబులు మ్రోగెను కిన్నరాంగనల్
పొనరుచు గానమట్లు పికపుంజము గానము సేసె నంతటన్. 85

తమరాజెంతకు రాకయుంట గనుచున్ దత్కారణంబేమియో
తమకుందోపమిఁ జోరులెల్ల నతిసంతాపంబునన్మ్రగ్గుచున్
దమినాచోరుఁడు చన్న దారిఁజని కాంతారమ్ము శోధించి గౌ
తమిచెంతన్గని రాతనిన్ యతిపదధ్యానాంత రంగుఁడుగాన్. 86

తెల్లబోవుచుఁ దనుఁగాంచు నెల్లవారి
నరసి సత్యసంధుఁడు బల్కె నాదరమున
నన్నలార దర్శనమిచ్చె నతిముదమున
స్వామి, మనమెట్టి సుకృతము సల్పినామొ, 87

తస్కరింపనెంచితి వీరి ధనము నేను
తస్కరణకింతదనుక నాధారమైన
నాదుతమమెల్ల మ్రుచ్చిలినారువీరు
చోరకళనన్నె యోడించి నారలార. 88

ఈకరుణాపయోనిధికి నిప్పుడు భిక్షను సేయగావలెన్
గాక, తొలంగఁబోదు మనకల్మష సంచయమింకనంచుఁ దా

వీకరణిన్వచింపవిని యేలికమాటకు బద్ధులౌచు న
ప్రోత్కతరాదరంబుపుడు చూపిరిచోరులు స్వామిచెంగటన్. 89

భక్ష్యభోజ్య చోష్య పానీయ లేహ్యాది
బహుళవస్తుతతిని భద్రిపఱచి
భిక్ష పెట్టిరంత విప్రులు మెచ్చంగ
నఖిలచోరవితతి యాదరమున. 90

తదనంతరమునఁ జోరులు
ముదమున నాస్వామిజనులఁ బొగడుచువారి
స్వదిలముగ సాగనంపిరి
కుదురగు భక్తినివనంబు కొనఁగనుచనుకన్. 91

నీడప గురుని యనుమతమున
కదలిరి చోరవరులు తమగ్రామమువంకన్
ఎదుటను స్వామిచరణముల
సదమలమతిమోపు సత్యసంధునితోడన్. 92

ఓమ్

# సత్యసంధుడు

## రెండవ భాగము.

---

సిరులకు నాలవాలము సుశీలురకెల్లను జన్మభూమి సుం
దరతర మందిరంబులకు స్థానము సూరులకాటపట్టునై
సురపురి వైభవంబునకు జోడన భాగ్యపురంబు ధారుణీ
సరసిజనేత్రికున్ దిలకసన్నిభమై యలరారుచుండెడున్. 1

ఆపురి నేలు నిర్మలగుణాఢ్యుఁ డనల్పపరాక్రముండు భా
షాపరపద్మగర్భుఁడు శశాంకనిభోజ్జ్వలమూర్తి పౌరసం
తాపహరుండు శత్రుజనదర్పవిదారి యఖండకీర్తి సం
వ్యాపితభూమిమండలుఁడు పౌరుషసింహుఁడనంగ నొప్పుచున్.

రాజ్యపాలనంబునఁ దగుశ్రద్ధఁ బూని
ప్రజలఁ దనుకన్నబిడ్డల పగిది నెన్ని
పండితచయముపైఁ గడుభక్తిఁ గలిగి
రాజ్యమేలు నాతఁడు జనరంజనముగ. 3

ప్రజ లేరీతిని దన్నుఁ గూర్చి పురిలో భాషించుకొంచుండిరో
సుజనశ్రేణికిఁ జిత్తరంజనముగా శోభిల్లునో పాలనం
బు జగంబందటు లేదో? చోరతతియేపోకల న్విజృంభింతురో
నిజముం గన్గొననెంచి రేల్దిరుగు క్షోణీనేత గూఢాకృతిన్. 4

ఒకనాఁడా యెకిమీఁడు వీడుఁగనఁగా నూహించి పెంజీకటిన్
సకలాలంకరణంబులన్విడిచి వేషంబంతయున్మార్చి తా
బికిరంబెత్తెడువానిలీలఁ దిరుగున్వీదుల్విలోకించుచున్
మకుటాలంకృతయోగ్యమౌ శిరమునన్ బ్రావల్వగన్పట్టఁగన్

తానినవశులేశ తస్కరుఁడై యుంట
ప్రభునికట్టెదుటను బడగ వెఱచె
ననఁగదోసకారి యంబుదంబులడాఁగెఁ
గటికచీకటిభువిఁ గ్రమ్మికొనియె. 6

ఆనడురేయి నానృపకులార్ణవపూర్ణశశాంకుఁడాకృతి
న్మాసినగాఱుచీఁకటుల ముద్దయొనానలరానునాతనిన్
బాణిఁగృపాణపాశముల్ బట్టినయాతని నొక్కచోరుని
న్మానకఁగాంచి డాసి యనుమానముతీరకపల్కె నిట్టులన్. 7

అన్నా! యెచ్చటికిపుడీ
విన్నడురేయిఁ జనుచుంటివేపని నీకుం
దున్నది నిజముగ నాకున్
గ్రన్ననఁ జెప్పుము వచింపఁగాఁదగునేనిన్. 8

అనవుఁడు చోరనాథుఁడిటు లాడెను నిక్కముదాపనేటికిన్
వినుమొకచోరనాయకుఁడ నేను నృపాలుని బొక్కసంబునన్
ధనమును దొంగిలింపఁదగు దారులబన్నుచు వచ్చుచుంటి నో
యనఘ! మఱుంగులేనియెడ నాడుముసీదు తెఱంగెఱుంగఁగాన్

అదివిని రాజు రాఁజకొను నాగ్రహవహ్నులతోడ 'నోర' యే
బెదరునులేక 'దొంగ'యని వీఁడను వీడను వీనినే నికన్

గదలఁగనీక ఖడ్గమునఁ గంఠముఁ గోసెదనంచు నెంచుచు
న్మదినిఁదలంచెఁ గ్రమ్మరన మందవివేకియతండు నిట్లుగన్.10

వీఁడొక చోరుఁడేనిమది భీతినివీడి వచింపనేర్చునే
నేడిటతానుదొంగనని నెమ్మొగమెన్నఁడుఁ జూడనట్టి నా
తోఁడ విశేషమీయెడను దోపకపోదు పరీక్షఁజేసెదన్
వీడక వీనితోఁదిరిగి పిమ్మటనేఁ బొలియింపగానగున్. 11

అని యోచించి వసుంధరారమణుఁడాహ్లాదంబు దీనత్వమున్
గనరానట్లు నటించుచుంబలికె నన్నా ! మందభాగ్యుండనేన్
ఘనమా నాదుకుటుంబసంఘమును నేఁగాపాడగ నాపథం
బును చింతింపగనేరకుంటి విధి మున్ముందెట్లు గావించునో.12

ఉద్యోగమొనరించి యుర్వీశు మెప్పించి
విత్తముఁగొనుటకు విద్యలేదు
వ్యవహారమునుజేసి బహుభాగ్యసంపదల్
పొదుపుసేయుటకును మదుపులేదు
వ్యవసాయవృత్తిని పంటలపండించి
పొట్టనింపుకొనంగఁ బొలములేదు
బానిసపనులనుఁ బైవారికడఁజేసి
పైకంబుగొనుటకు బలములేదు

ఇతరవృత్తులవేవియు నెఱుఁగనింక
నెటుల సంసారతోయధి నీదగలనొ
యంచు విలపించి విలపించి యెంచినాఁడ
చోరవృత్తియెనాకు నాధారమంచు. 13

కానియొక్కమాట కానియు నెన్నఁడు
నెఱుఁగ దాఁగిలించి యింతదనుక
నీపిరుందనన్ను నేర్పునఁ గొంపోయి
కొంత తెరవుఁ జూపఁ గోరుచుంటి. 14

అనవుఁడు చోరనాథుఁ డిటు లాడె సమాదర మొప్ప "నట్టులే
యొనరుపు మన్న; నేసగము నొప్పుగ నిచ్చెద నీకు; రమ్ము నా
వెనుక న"యంచు వానిఁ గొని వీథుల వెంబడి నేగ నెవ్వఁడిన్
జనపతి కోటవంక కల హర్మ్యపతిచూడఁగ రిచ్చపాటునన్. 15

ఒకమందు ద్వారపాలకులపై జల్లి మ
త్తిల్లి వారు పడురీతినొనరించి
ఒకయాకు తలుపున కొకయింత తాకించి
యతిసూక్ష్మముగ గడియల్పగిల్చి
ఒకమంత్రి మతివేడ్క యుచ్చరించి యచటి
పెట్టెకప్పులనెల్ల పేలఁగొట్టి
ఒకతంత్రమును బన్ని యొరులకుఁ గానరా
కుండంగ నందందనుండి తిరిగి

అతని చోరకళాకుశలతను మిగుల
జూపె సార్వభౌమున కతిచోద్య మొదవ
గుండెపైఁ జేయినిడికొని యుండె రాజు
ఔర! యెంతటి దారుణమనుచు గనుచు. 16

ఒక్కమందసమున నొప్పారుచున్నట్టి
మేటిరత్నములను మూటఁగాంచి

అందు రెంటిఁదీసి యాతనికొకటిచ్చి
తాను కడమదాని దాచియుంచి
సత్యసంధుఁడాడె సంగడీడా! కార్య
మునెరవేరెనింకఁ బోదమయ్య. 17

అన నాకైతవతస్కరుండు దరహాసాలంకృతాస్యంబుతో
ననియెన్ దస్కరుఁగాంచి చోరకులనాథా! యీసువర్ణంబు నీ
ధనమీవెండియు, నీమణుల్ పసిడివస్త్రంబుల్మహారత్నముల్
గనియున్ముట్టకయుంట యేమిటికి భాగ్యంబింత చేదయ్యెనే. 18

పోనీ ముద్దులమూటగట్టు రతనంబుల్మూడుగాన్పింపఁగన్
దీనిన్ముట్టక రెంటినేఁగొనుట సందేహాస్పదంబయ్యెడిన్
మానంబున్నదె యార్జనంబునకు లెమ్మా శంకలన్వీడుమా
దీనిన్మానకతీయుమా యదను బ్రాప్తింపన్ వృథాపుచ్చెదే.

విషమమైనఁబంచుకొనఁగ వీలుపడదు
గానమానితి మూడవదానిఁదీయ
నందువేమొ హెచ్చుశ్రమను బొందినావు
తగవె హెచ్చుపాలుగొనఁగ తగవెయిది. 20

నానిటులాడె చోరకులనాథుఁడు ముచ్చిలు. దానిలోననే
మానకయర్థమిత్తునని మానవరత్నమ! యంటిఁదొల్త నే
మానస మొప్పనేయనిన మాటను దబ్బరపుచ్చ? గావునన్
దీనిఁద్యజింపఁగావలసె తీసినరత్నయుగంబు చాలదే. 21

ఆశకు మేరలేదు చతురంబుధివేష్టిత భూమిమండలా
ధీశునకైన చిత్తమున నేవియొ కోరికలూరుచుండు దా

నాశనమొందుదనుక ధననాథునకైన పరార్థరాశిపై
నాశజనించునన్న నికనల్పులమాటలు జెప్పనేటికిన్. 22

దప్పితీరంగ నీరంబుఁ ద్రావవచ్చు
గానికూలంకషంబును గంటినంచుఁ
బొట్టపగులంగఁ గ్రోలినఁ గిట్టుకున్నె ?
ఆశలకు మితిలేకున్న నతఁడడంగు. 23

ఈరతనంపు మూల్యమున నెన్నియొ యేడులు బుచ్చవచ్చుగా
నారయనొప్పు నాపిదప నాయువు వాయకయున్న జీవనా
ధారము మాటయిందుగల ద్రవ్యము నెల్లను మూటగట్టఁగా
నేరగనౌనె యాశలను నింపకుమన్న మనంబు నెన్నఁడున్. 24

అనుచు భూవరుఁగొంతదవ్వనిచియతఁడు
వెడలె గుప్తస్థలంబున విశ్రమింప
వానిపలుకుల కాశ్చర్యపడుచు రాజు
గుప్తవర్తనంబున వాని గుట్టునెఱిఁగి
పట్టదూతనంపె నిగళబద్ధుఁ జేయ. 25

మరునాఁడా నృపవంశరత్నముని జామాత్యున్విలోకించి త
స్కరులీవీటికివచ్చి రాతిరి ధనాగారంబునన్ జొచ్చి రం
చెలుఁగన్వచ్చెను వారలచ్చట ధనంబేమేమిగొంపోయిరో
యరయంగా జనుమన్న నీవుపిదపన్ న్యాయంబు యోచింపుమా

పట్టువడి చోరుఁడు నిగళబద్ధుఁడాయె
నొక్కరుఁడు తదితరులెందరుండిరొక్కొ
నీవు వానినిరప్పించి నీతిపథము
విడువకుండ విచారణ నడుపుమనియె· 27

అననామంత్రియు వినయం
బున జననాథోత్తమునకు మ్రొక్కుచుఁగోశం
బును గనఁదగునని తనమన
ముననెంచి చనియెను గూఢముగ నృపునాజ్ఞన్. 28

కోశముఁజొచ్చి విత్తములకుప్పలు మున్పటియట్లయుంటయున్
లేశముసొమ్ముపోయినటులేకునికిన్గని మంత్రితామనగ
కోశములోననెంచె నిటుకొన్నిక్షణంబులు చోరజాతిక
త్యాశయదేటికిన్గలుగదయ్యెనొ యీధనరాశిఁజేకొనన్. 29

మైకము కన్నుగప్పెనొకొ మద్యముమెండయి బుద్ధిదప్పెనో
గాక మహాంధకారమునఁ గానఁగలేదొకొ చోరబృందమీ
పైకమువంక ? చేదగునె ? బంగరునాణెములెట్టివారికిన్
బోకలుపోసినట్టి సిరిముట్టకపోవుట దేటికోకదా. 30

అట్లు మిగుల నాశ్చర్యమగ్నాత్ముఁడౌచు
మందసముల శోధించుచు మంత్రివరుఁడు
గాంచెనొకమందసంబునఁ గాంతులీను
చున్న మేలైనరత్నంబు నొక్కదాని. 31

పిమ్మట నీరీతిగ చి
త్తమ్మునఁ దలపోసెమంత్రి ధరణీనాథుం
డిమ్మందసమ్ములో ర
త్నమ్ములు మూఁడుండినట్లు దానుడివెఁగదా. 32

తీయనోపు నాదొంగలు దీనినుండి
రెండురత్నంబులను కాని రెండుదీసి

యీరతనము గొంపోవని హేతువేమొ
తీయవెఱచిరొకొ వారి తెల్విగూల. 33

చక్కని కాంతిపుంజములఁ జల్లుచునుండెడు రత్నమార చే
జిక్కినవేళ మందులయి చేకొననేరని వెఱ్ఱులందు రే
యక్కట దీనినారసిన యప్పటినుండియు నాకెదీనిపై
మక్కువగల్గుచుండె పరమానవవర్గము మాటలేటికిన్. 34

కాంచగలేదొ రత్నముల ధాత్రితలిపై బహుకోట్లు లక్షలున్
గాంచితిమొకో యెందయినఁ గాంతులనీనెడు నిట్టిరత్నమున్
గాంచనచేలుఁడైన తనకౌస్తుభరత్నము వీడజూడఁడీ
యంచితకాంతి సంపదల నద్దియు దీనిని మీరకుండుటన్. 35

ఏలమహావసుధాతల
మేలఁగఁజాలెడు పదవుల నెన్నియొ యున్నన్
జాలదె యనంతరత్నముఁ
బోలెడు నీవిమలరత్న ముఖ్యంబున్నన్. 36

ఈరతనముఁజూచినదాది హృదయమందుఁ
గోర్కె వేధించుచుండెఁ గైకొనుమటంచుఁ
బరులద్రవ్యంబుఁజేకొనఁ బాడిగాదు
ఊరకుంటకు మనమొప్పకుండెనకట. 37

ఇదియొకవేళ నేనకొని యేగుదునేని జగంబు హర్తయే
యిదియు హరించియుండునని యెన్ను;నిజంబును దాగ్రహింపనే
రదు; తగుతీర్పుఁజెప్పుటకు రాజనియోగము నాకెయుండె; నీ
యుదనునువీడరాదు సిరియబ్బెడువేళల జంకనేటికిన్. 38

తానొక రెంటిఁదీసినటు తస్కరుఁడేడ్చిన నేడ్వవచ్చు; న
వ్వానిని విశ్వసింపఁ జనువాఁడొకఁడుండు నె యొక్కఁడుండినన్
నేనెహరించితంచు ననసేరెడు మానవమాత్రుఁడుండు నే
మానవనాథుఁడట్టు లనుమానముమానక పూనునేమదిన్. 39

నందిఁబందిగ పందిని నందిగాను
సలుపఁజాలెడు శక్తియుఁగలదునాకు
నాదుతీర్పును న్యాయంబుఁ గాదనంగఁ
జాలుమనుజుండు నిలువంగఁ జాలఁడవని. 40

ప్రభున కెట్లు ప్రాప్తించె నీభాగ్యరాశి
ప్రజలకష్టార్జితంబెగా రాజుధనము
యిందు నేనొక్కరత్నంబుఁ గొందునేని
గాలిపోవునె యాతనికొంపయెల్ల. 41

ఎల్లి చోరునిపై నేరమెల్ల నిలిపి
మరణదండనమువిధించి చెరుపవలయు
నంచుఁ దలపోసి యారత్నమపహరించె
నెట్టిపనికైన కారణంబీధనంబె. 42

ధనమేహానికి నాదికారణమగున్ తన్వుల్ ద్వితీయంబునా
ధనకాంతా నిలయంబులం దలతురీ దైవజ్ఞులాకారణం
బుననే మారణహేతుభూతముగనే పుణ్యాత్ముఁడీరెంటికిన్
దనచిత్తంబును జిక్కనీఁడొ యతఁడే ధన్యుండు భూమిస్థలిన్
సామంతాఖిలమిత్రమంత్రి కవిరాజశ్రేణి సేవింపఁగన్
శ్యామల్యావనసేవసేయగబుధుల్ సంస్తోత్రముల్సల్పఁగన్

హేమాలంకృత సింహపీఠ నధిరోహించెన్ సుతేజంబునన్
భూమీనాయక పుంగవుండు విడియంబున్ బుక్కిటం బెట్టుచున్

ఆటవెలది పిండులట నాట్యమాడంగ
బోటియొకతె వీణమీటుచుండ
గాయకాళి మధురగానంబు సేయంగ
నిండుకొలువుదీర్చె నృపవరుండు. 45

అంత నమాత్యపుంగవుని యానతిచొప్పున భృత్యుఁడొక్కఁడ
త్యంతరయంబునంజని మహాబలభూషితగాత్రుఁ జోరుఁ గా
రాంతరబద్ధదేహు మలినాంగుని జేకొనివచ్చి మేదినీ
కాంతుని ముంగిటన్నిలిపెఁ గావలివారలు కాచుచుండఁగన్.

మంత్రబద్ధమైన భుజంగమంబు భాతి
బోనుఁజిక్కిన బెబ్బులి ఠేనియటులఁ
గట్టువడియున్న తస్కరుఁ గాంచియంత
సచివుఁడిట్లనె తీర్పును సలుపనెంచి. 47

ఎచ్చటనునికి? నామమది యెట్టిది? నెచ్చెలులెవ్వరుండిరే
యిచ్చట తస్కరింపనది యెన్నిదినంబులనుండి యత్నమో?
ముచ్చిలినట్టి విత్తచయము న్గడు నేర్పడఁ జెప్పుమోయి; యీ
సచ్చరితుండు భూవరుఁడు జాలిజనించినవీఁడు నిన్నికన్. 48

శిక్షతప్పుట కనృతంబుఁ జెప్పఁబోకు
చెప్ప మరణదండన నీకు సిద్ధముగున
టంచు మంత్రివచింపఁగా ననియెనతఁడు
భాగ్యనగరాధినాయకు వంకదిరిగి. 49

"ఇచటికి దాపులంగల మహీధరసీమ నివాసభూమినే
వచట వసించు తస్కరచయంబున కీశుఁడ; నిన్నరేయి నే
నిచటకువచ్చి కోశమున నింపగురత్నయుగంబుఁగొంటి నీ
వచనములందు లేశము నబద్ధములేదిక మేదినీవరా. 50

చోరవృత్తిని గోత్తగాఁ జేరినట్టి
యువకుఁడొక్కఁడు నాతోఁడ నున్నవాఁడు
వానినామంబు; వాసంబు నే నెఱుంగ
నొక్కరత్నంబు నాతనికొసఁగినాఁడ. 51

అనవిని యెంతయు న్వికటహాసముచేయుచుధూర్తమంత్రి యా
తనిఁగని యిట్లనె "న్దులువ! దబ్బఱలాడిన నమ్మనేమొ యీ
జనపతియంచు నెంచకుము సత్యముపల్కుము క్రొత్త వానితోఁ
జనినటుపల్కినన్గలుగఁజాలునె నమ్మిక విత్తకేనియున్. 52

తానొక చోరనాథుఁడట తస్కరవృత్తిని లేశమేనియున్
జ్ఞానములేనివాని విధినవ్యుని దొడ్డని దొంగిలింపఁగాఁ
బూనుచు నేగుదెంచెనఁట బొల్పఁగలేఁడట [illegible]టిదొంగనిం
తేనియు నమ్మవచ్చునొకొ యీతనిపల్కుల చెప్పుఁడెల్లరున్.

పసిడిపెట్టెలో దంతపు బరిణెలోన
మూఁడుమణులుండె మున్ను నేఁబోయిచూడ
నేఁడుగానరాదొకదాని జాడయైన
వీఁడు రెంటిఁదీయ కడమ దేఁడకేఁగు. 54

మూఁడు మణులుండ నొకదాని విడిచనుట
భూపుపైని వాత్సల్యంబు వొడమియేమొ!

ఎవఁడునమ్ము నీతఁడు వచియించుమాట
విశ్వసింపనగునె దొంగ వెఱ్ఱిపలుకు ? 55

మూఁడుమణులను గొనివచ్చి వీఁడు నేఁడు
నునిచి యేగుట కడు లెస్స జనపతికడ
కాదు తేఁజాలుననిపల్క కలదు ముప్పు
చిత్రవధ జేసి క్రిక్కెంతు చిత్రముగను" 56

అని తీర్మానము సేసిన
యనయుండగు మంత్రిపల్కులాలించి నృపుం
డనుమానించె మనంబునఁ
దనమంత్రి తృతీయరత్న తస్కరుఁడంచున్. 57

అంతట సత్యసంధుఁడును ప్రాంజలియై వచియించె నిట్లు "నే
సుంతయు దబ్బరల్వలుకఁ జోరుఁడనైనను నమ్ముఁడయ్యయొ
కింతయు రత్నపుందెరవు నేనెఱుఁగన్ గురుదేవునాన యా
వంతయు నట్టినిందతలపై నిలుపందగదింక నెన్నఁడున్. 58

శృంగేరీ పీఠవిభుని
చెంగటమును నేశపథము చేసితినయ్యా
దొంగక సత్యముపలికెద
భంగంబు లవెన్నివచ్చి పైఁబడుచున్నన్. 59

చోరవృత్తిని త్యజియింప నేరకుంటి
దానికన్నను జీవనాధార మొకటి
కానఁజాలకుంటినిగాన కానియెపుడు
కల్లలాడను గురుని యోగంబువలన. 60

బిగియు నేమొ యురిత్రాడు పీకకంచుఁ
దీయని రతనా లేరీతిఁ దెచ్చువాఁడ
నొక్కరతనంబుమాత్రమె యున్నదిపుడు
వలయు నేని నేనొసగంగగలను దాని. 61

చెండెదమ స్తకంబని వచించెద వేటికి మాటిమాటికిన్ ?
చెండినచెండుమయ్య మరిజీవికి కాయము శాశ్వతంబుగా
నుండునె ? యెన్నఁడో యడఁగనున్న శరీరము నెల్లనిప్పుడే
చెండగనున్న నేలవగ జెప్పుమమాత్యకులాబ్ధిచంద్రమా. 62
ఎన్ని శరీరముల్దాడివి యెన్నిటివిడెను జీవియింతకున్
మున్నుస్థిరంబుగానిలిచిపోయెనె యొక్కశరీరమైన ? యీ
యున్నదిమైన వేఁదొలఁగకుండునటంచును నమ్మవచ్చునే ?
క్రన్నన జంపుమయ్య మరికల్గును నూతనకాయమంతటన్. 63

సత్యవాగ్వ్రతభంగంబు జరిగెనంచు
నొక్కయపకీర్తి శిరముపై కెక్కఁగాన
వగచుచుంటినికాని నేవగవఁబోను
కాయమెక్కునేమొ యురికంబమంచు” 64

అననాప్రధానమంత్రియుఁ
గనుఁగవనుండి నిప్పుకణములు రాలన్
ఘనరోషావేశమున న
తనితోనిట్లనెఁ గునీతితత్పరుఁడగుచున్. 65
“ఔర ! యే మెట్టవేదాంతి నాశ్రయించి
యభ్యసించినావుర తస్కరాగ్రగణ్య !

యిట్టి వేదాంతవచనమ్ములీవు ? కట్న
మెన్నికొంపలఁ గూలిచియిచ్చినావో ? 66

కాయమందింత రోతయే కలగెనేని
కడుపునింపఁగా నేల సీకలుషవృత్తిఁ ?
బుట్టువిచ్చినవిధి తిండిపెట్టడొక్క
కొండగుహాలలో కాపురముండరాదె ?" 67

అత్తరి కోపోద్దీపిత
చిత్తసరోజుండయి యురిశిక్షకుతగు, నీ
పుత్త్రుఁడను మంత్రికి నృపా
లోత్తంసుఁడిటులవచించె నొప్పగులీలన్. 68

"ఆరతనంబులెల్ల నపహర్తకుజిక్కిననాటిరేయి నేఁ
జోరునివేసమూని జనుచున్ననియప్పుడువీఁడు కోశమున్
జేరెదువేళదబ్బరపు నెయ్యమునన్సహచారినైతి; మే
మా రతనాలలో నొకటి నచ్చుటనీడితి మేమియయ్యెనో. 69

మరియొకవింత; యందు పెరమానిసి దూఁగగలేదు నీవుద
ప్ప; రతనమెట్లు పోయెనొక్కొ పాపముపుణ్యము నింకదైవమే
యెఱుఁగు; హసింపనేల ? నికనీతఁడె దొంగయటంచుభవ్య శీ
లురెయిటుదొంగదారులనుద్రొక్కఁగనల్పులుద్రొక్కకుందురే-

నమ్మియున్నరాజ నిమ్మాడ్కిఁ కనుమూసి
మోసపుచ్చునట్టి మూర్ఖకన్న
కల్లలాడకుండ కాలంబుపుచ్చెడు
దొంగవాఁడె మిగుల దొడ్డవాఁడు ! 71

అన్నన్నా ! యెన్నెన్నో
యెన్నకగాంచిన జమీల నీమంత్రివరుల్
క్రన్ననజేసెదు మోసము
సన్నముగావించుచుండె జగతీస్థలిలో. 72

పరులసొత్తుకై మోసముల్పన్నువారు
న్యాయరహితమౌ తీర్పుల నడపువారు
లంచముల్గోరి దారియోచించువారు
పెద్దయుద్యోగులుఁగలరు పెక్కుమంది. 73

పదవివచ్చునంత బంగారుగోడలఁ
బెట్టఁజాలు దారివెతకువారె
కానిపరులకున్న కష్టముల్ దీర్చెడు
దారిఁగాంచనేరువారు లేరు. 74

న్యాయముచచ్చె; వంచనకు నాదరమెంతయు హెచ్చె;
కార్యమౌ
హాయినివ్రచ్చె; నెవ్వడిని స్వార్థము ముందుకువచ్చె; హింసక
న్న్యాయకఅచ్చె; బొంకుకడు పూర్తిగజొచ్చెవసుంధరాస్థలిఁ
మాయలమారి మర్త్యులకు మంత్రిపదంబులు వచ్చినంతనే. 75

ఓమహాజనులార ! యుద్యోగులార !
లోకమెల్ల గ్రుడ్డిదటంచు లోననెంచి
మాయపనులఁగావించుట మానుఁడయ్య
పాపమెన్నటికైనను బ్రద్దలౌను. 76

పరులబుట్టలోఁ బెట్టుటవచ్చు నేని
యెంతయో నిపుణులమంచు నెంచనేల ?
గాంచఁజాలకున్నారు లోకంబులోన
మాయబుట్టలోపలజిక్కు మంచిదారి !” 77

అవి చెవిసోకినంత హృదయంబున నెంతయుసిగ్గుపుట్టఁ గ
న్గవతడిపెట్టి, మంత్రి జననాథుని పాదయుగంబు ముట్టి మ
ర్మవచన సంచయంబు నొకపక్కకుఁ బెట్టి వడంకుమేనితో
సవినయభాషలన్నుడివె క్ష్మాతలనాథునితోడ నీవిధిన్. 78

“ప్రియమున నాకు నీసచివవృత్తి నొసంగిన మేటికిన్గడు
న్నయమున సర్వకాలముల నన్నుఁగృపామతిఁజూచుస్వామికి
న్ప్రియమున మోసగించి యపరాధము చేసితి నీచబుద్ధినై
దయగనుమంచు వేఁడఁదగు ధైర్యముచాలదు నేఁడుభూవరా

చదివితి ధర్మశాస్త్రములఁ జక్కనితీర్పులఁజెప్పుచుంట నీ
దుదయకు నాస్పదంబయితి దుష్కరతృష్ణకుఁ జిక్కి నేఁడు నీ
వదనము ముంగటన్నిలిచి భాషిలఁజాలకయుంటి సిగ్గునన్
సదయమతీ ! యొసంగుమిక చయ్యన దారుణశిక్షయెద్దియో.

యెంతటిదారుణంబో యిది యేలిక కండ్లను దుమ్ముకొట్టుటే !
యింతటి నీచమానసునకేదియొ దండనఁజెప్పుమయ్య నా
యంతటి హీనులుండ నికనంబుధిమేఖలకెట్లుమేలు ? భూ
కాంతవతంస ! పంపుమురికంబము చెంతకు సత్వరంబుగన్ .81

ఒక్కసుజనుండు వసియింప నొప్పుస్థలము
నాక్రమించితి నేడు నేనవనిలోన

నేనుకూలిన సద్గుణనిలయునొకని
నీస్థలాన నిలుపునేమొ యీశ్వరుండు ! 82

ఈయకలంకకీర్తి నిపుఁడెన్నియొ నిష్ఠురభాషలాడి యం
న్యాయముసేసినాఁడఁ గఠినాత్ముఁడ నక్కట నాదుపాపముల్
వాయఁగ నింకనేదియొ యుపాయమటంచును ఖేదమందఁగా
నాయవనీశమండనుని యాత్మనొకించుక పుట్టెజాలియున్. 83

అట్లు కడుఁ జాలినొందుచు నధిపవరుఁడు
పనిచె వేఱొకశిక్షను వానికిడక
పదవినుండి యావెంటనె భ్రష్టుఁ జేసి
ప్రాణహింసనొనర్పరు ప్రాజ్ఞులెపుడు ! 84

అవనినాథునానతికి మారాఁడ లేక
సత్యసంధుఁడు తాఁబూనె సచివపదవి
నీతివర్తనకెప్పుడు లోతిగాక
ఖ్యాతిగడియించె నాతఁడు క్ష్మాతలమున. 85

విద్యయున్ననేల ? విత్తముండిననేల ?
పదవియున్ననేల ? ఫలముసున్న
ధరణిసీనికీర్తి తాత్కాలికంబగా
నీతియుతునిఖ్యాతి నిలచునెపుడు. 86

సంపూర్ణమ్.

శ్రీ సాయిబాబా ప్రెస్, విజయనగరం—1949.

వలయువారు :—

**కొల్లూరు నారాయణరావు**

**కొక్కిరాపల్లి.** ఎలమంచిలి పోస్టు,

M. S. M. Ry , *Vizag Dist.*

అని వ్రాయవలెను.